రామాయణమిదం కృత్స్నం శృణ్వతః పఠతస్సదా।
ప్రీయతే సతతం రామః సహి విష్ణుస్సనాతనః। 55

శ్రీరాముడు సాక్షాత్తు సనాతనుడైన శ్రీమహావిష్ణువుయొక్క అవతారమే. కనుక రామాయణమును సంపూర్ణముగా వినిన వారికిని, పఠించిన వారికిని రామానుగ్రహము సిద్ధించును.(55)

ఆదిదేవో మహాబాహుః హరిర్నారాయణః ప్రభుః।
సాక్షాద్రామో రఘుశ్రేష్ఠః శేషో లక్ష్మణ ఉచ్యతే। 56

రఘువంశశిరోమణి, మహాబాహువు ఐన శ్రీరామచంద్ర ప్రభువు దేవాదిదేవుడైన శ్రీమన్నారాయణుడే. లక్ష్మణస్వామి ఆదిశేషునిఅవతారము. (56)

కుటుంబవృద్ధిం ధనధాన్యవృద్ధిం
స్త్రియశ్చ ముఖ్యా స్సుఖముత్తమం చ।
శ్రుత్వా శుభం కావ్య మిదం మహార్థం
ప్రాప్నోతి సర్వాం భువి చార్థసిద్ధిమ్। 57

ఈ రామాయణమహాకావ్యము సర్వశుభకరము. సమస్తప్రయోజనములను చేకూర్చును. దీనిశ్రవణమువలన కుటుంబవృద్ధియు, ధనధాన్యసమృద్ధియు కలుగును. ముఖ్యముగా స్త్రీలకు ఉత్తమమైన సుఖములు ప్రాప్తించును. (57)

ఆయుష్య మారోగ్యకరం యశస్యం
సౌభ్రాతృకం బుద్ధికరం సుఖం చ।
శ్రోతవ్య మేతన్నియమేన సద్భిః
ఆఖ్యానమోజస్కరమృద్ధికామైః। 58

ఈ ఇతిహాసము ఆయురోగ్యములను, కీర్తి ప్రతిష్ఠలను, సౌభ్రాతృత్వమును, బుద్ధికౌశలమును సుఖశాంతులను, తేజోవైభవములను ప్రసాదించును. కావున సమస్తసంపదలను అభిలషించెడి సత్పురుషులు నియమనిష్ఠలతో దీనిని శ్రవణము చేయవలెను. (58)

ఏవమేతత్ పురావృత్తమ్ ఆఖ్యానం భద్రమస్తు వః।
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్। 59

దేవాశ్చ సర్వే తుష్యంతి శ్రవణాద్గ్రహణాత్ తథా।
రామాయణస్య శ్రవణాత్ తుష్యంతి పితరస్తథా। 60

భక్త్యా రామస్య యే చేమాం సంహితామ్ ఋషిణా కృతామ్।
లేఖయంతీహ చ నరాః తేషాం వాసః త్రివిష్టపే। 61

ప్రాచీనమైన ఈ రామోదంతము మీకు సర్వశుభములను చేకూర్చుగాక. మీపై శ్రీమన్నారాయణునిప్రభావము మిక్కిలి ప్రసరించుగాక. ఈ రామాయణమును తమకడ కలిగి యుండి ఇందలి దివ్య గాథలను వినినచో దేవతలును, పితృదేవతలును తృప్తిపడుదురు. వాల్మీకి మహాముని రచించిన రామాయణసంహితను భక్తితో వ్రాసిన వారు తప్పక స్వర్గసుఖములను పొందుదురు. (59-61)

ఇది వాల్మీకిమహర్షి విరచితమై ఆదికావ్యమైన శ్రీమద్రామాయణమునందలి
యుద్ధకాండమునందు 'శ్రీరామపట్టాభిషేకము' అనెడి నూటముప్పదిఒకటవసర్గము.

* * *

కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్।
కరోమి యద్యత్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి॥

యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్। తత్సర్వం క్షమ్యతాం దేవ శ్రీరాఘవ నమోఽస్తుతే॥

ఆత్మా త్వం క్షితిజా మతిః సహచరాః ప్రాణాః శరీరం గృహమ్
పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః।
సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వా గిరో
యద్యత్ కర్మ కరోమి తత్తదఖిలం రామాఽస్తు తే పూజనమ్॥